పండిత శ్రీరామశర్మ ఆచార్య, మాతా భగవతీదేవిగార్ల సంరక్షణలో

# యుగసంధి ప్రబోధం

(యుగ సృజేతల సింహనాదం)

సంపుటి : 2 మార్చి 1997 సంచిక : 10

## గాయత్రీ మహా మంత్రము







ఓం భూర్భువః స్వః తత్సవితుర్వరేణ్యం
భర్గోదేవస్య ధీమహి
ధియో యోనః ప్రచోదయాత్

భావము : ఆ ప్రాణస్వరూపుడైన, దుఃఖనాశకుడైన, సుఖస్వరూపుడైన, శ్రేష్ఠుడైన, తేజస్సుగల పాపనాశకుడైన, దేవస్వరూపుడైన పరమాత్మను మేము అంతరాత్మలో ధరించెదము గాక. ఆ పరమాత్మ మాయొక్క బుద్ధిని సన్మార్గము వైపు ప్రేరేపింప చేయుగాక.

**భారతదేశం తిరిగి జగద్గురు పీఠాన్ని అధిరోహించి తీరుతుంది.**

# నివేదన

అస్మదీయులారా....హారాహుషార్.... మమ్మల్ని మీరు తెలుసుకోండి. 'గురుసత్తా' ఇస్తున్న సూచనలు జాగ్రత్తగా గమనించండి. ఎంత అమాయకంగా చిన్నపిల్లల్లా ప్రవర్తించే స్థాయినుండి ఎదగండి. ఈనాటి సాధకుల స్థితి కూడా 'హీరోహొండా జనరేటర్' ఎడ్వర్‌టైజ్‌మెంట్‌లోని పిల్లవాని ప్రవర్తనలానే వుంటుంది. చదవరా అని తల్లి చెపుతుంటే అమ్మా పెన్సిల్ లేదు........అమ్మా పుస్తకం లేదు అదిలేదు.... ఇదిలేదూ....అని అటూ ఇటూ సవరిస్తాడు. చివరికి కరెంట్ పోతే 'అయ్ కరెంటుపోయిందీ 'అని ఎగిరి గంతేస్తాడు. ఆ తల్లి ఆ జనరేటర్ స్టార్ట్‌చేసి ఆ వెలుగులో చదవమంటుంటే కష్టంగా చదవబోయేసరికి ఫోన్ మ్రోగితే 'అమ్మా ఫోన్' అని చదువుని వదలిపెట్టాలని ప్రయత్నిస్తాడు. అలా వుంది సాధకుల విషయం కూడా. ఆ పిల్లవాని భవిష్యత్ ఉజ్వలంగా వుండేందుకు తల్లి ప్రయత్నిస్తుంటే పిల్లవానికి దానిని అర్థంచేసుకొనే శక్తిలేక తప్పించుకో చూస్తాడు. అలాగే గురువులు ఈ యుగసంధి కాలం విశిష్టత చెప్పి ప్రతి నిమిషం విలువైనది సాధనలు చేయండి అంటే ఆసాకు, ఈసాకు చెప్పి తప్పించుకో చూస్తున్నారు. ఎన్ని సాకులు చెప్పినా బిడ్డమీద తల్లి ఏ విధంగా శ్రద్ధ తీసుకుంటుందో అలాగే గురువుకూడా శిష్యునిమీద అంతకన్నా శ్రద్ధతో సాధనలు చేయించుటకు సిద్ధంగా వున్నాడు. ఎన్ని కారణాలు చెప్పి తప్పించుకోవాలన్నా అన్నీ ఓర్పుతో విని సాధనా జీవితమే ఈ జీవితలక్ష్యం. దానిని గమనించండి. అంటూ నిస్వార్థ భావంతో ప్రోత్సహిస్తున్న గురుదేవులు వెంట వుండుటకన్నా అదృష్టం యింకేముంటుంది. కనుక మిత్రులారా.... జాగ్రత్త ! ఆ ప్రకటనలోని 'చిన్నవాడిలా' అమాయకంగా మిమ్మల్ని మీరు మోసగించుకోకండి. రండి.... ముందుకు వచ్చి సాధనలు చేయండి.

ఇట్లు,

మీ ఎడిటర్

# R.K. Letter

సాధనా సమర యోధులకు,

యుగసంధి గురించి మాట్లాడుతూ మనం "యుగసంధి"లోనే వున్నాము అన్న సంగతి మరచిపోతున్నాము. సాధకుడు మూడు ముఖ్యమైన సంగతులు గుర్తుంచుకోవాలి. 1) మీ దైనందిక నిత్యకృత్యాలు, కుటుంబ బాధ్యతలు, జీవనభృతి సంపాదక (ఉద్యోగ) బాధ్యతలు త్రికరణశుద్ధిగా నెరవేర్చి తీరాలి. 2) మనము ఎన్నుకున్న 12 మంది గురువుల కార్యక్రమాల మీద స్పష్టమైన అవగాహనకొరకు బృంద చర్చలు, సమావేశాలు ఏర్పాటు చేసుకోవాలి. గురువుల దారిమీద మూడునెలలోపల సమగ్ర అవగాహన పొందటానికి మీరు ఏర్పాటు చేసుకొనబోయే కార్య ప్రణాళిక నాకు తెలపండి. ఉదాహరణకు C.V.V. గారి గురించి, ఆయన గురించి బాగా తెలిసిన వ్యక్తుల ద్వారా "C.V.V. మరియు నేటి పరిస్థితులలో ఆయన సాధనయొక్క వుపయోగము" అనే అంశముమీద కనీసము 5, 6 గురితో చర్చా కార్యక్రమం పెట్టుకోండి. 3) రోజుకు కనీసము 8 గంటలపాటు మన కార్యక్రమాలు అన్నీ ఆచరించండి. యుగసంధి విశిష్టత తెలిసిన మీరు సమయము లభించుటలేదు అని అనకండి. 2000 సంవత్సరము తరువాత మీరు రోజుకు 30 గంటలు ఇచ్చినా వృథాయే. ఈ క్షణం నుండి గురుసత్తా కార్యక్రమాలకు మీరు వినియోగించే ప్రతీ క్షణము బహు మూల్యమైనది. మీరు చేయండి, లేకపోతే కనీసం చేయగలిగేవారికి చేయూతనివ్వండి.

ఇట్లు,

మీ శ్రీ రామకృష్ణ

# గురుపాదుకాస్థవ వివరణ

హృద్గతం విమలం మనోజ్ఞ విబాసితం పరమాపతం
నీ లమధ్య సునీల సన్నిభ నాద బిందునిజాంబకం
సూక్ష్మకర్ణిక మధ్య మస్థిత విధ్యుదాది విబాసితం
ప్రాత రేవహి మాన సాంతర్భావయే ద్గురుపాదుకం

2 ఇది సింహ రాశి కి సంబంధింస శ్లోకం :-

దేహములో ఇది హృదయాన్ని సూచిస్తుంది. హృదయములో పరమాణువలె మనోజ్ఞముగా విమలముగా విభాసిస్తున్న బిందువు ద్వారా ఉత్పత్తి అవుతున్న "అనహత" నాదాన్ని సూక్ష్మ కర్ణిక మధ్యలో ఉన్న మెరుపుల ద్వారా వినవచ్చు. అది సునీలమైన కాంతికలదిగా వుంటుంది. గురువుయొక్క అనాహత వాణీని ప్రాతఃకాలములో ఏకాంతములో వినవచ్చును. ఇక్కడ ఏర్పడిన అనాహత నాదంమీద కూర్చుండగల్గితే అదే నిజమైన సింహాసనము ప్రజల హృదయాలలో తన హృదయ గత భావాలను గురువు యొక్క హృదయ గత భావాలకి అనుగుణ్యముగా మార్చుకోవాలి. మఖ-4 పాదాలు, పుబ్బ-4 పాదాలు, ఉత్తర 1పాదము. బేసిరాశి, క్రూరరాశి, పురుషరాశి, స్థిర రాశి, అగ్నితత్త రాశి, అధితతిరవి.

6 పంచ పంచ హృషిక దేహమనశ్చ తష్కపర స్వరం
పంచభూత సకామ షట్క సమాన శబ్ద ముఖేతరం
పంచకోశ గుణ త్రమాది సమస్త ధర్మ విలక్షణం
ప్రాత రేవహి మానసాంతర్భావమే ద్గురుపాదుకం

ఇది కన్య రాశికి సంబంధించిన శ్లోకం :-

దేహ నిర్మాణానికి అవసరమైనట్లు పంచ జ్ఞానేంద్రియాలు. పంచ కర్మేంద్రియాలు, వాటి మధ్య సంబంధం ఏర్పరచుకొనే మనస్సు మొ॥ అంతఃకరణ చతుష్టయము వాయువ్య శబ్దము ద్వారా, పంచ కోణములద్వారా పంచ భూతముల నియంత్రణము మొ॥ సమస్త విలక్షణమైన ధర్మాలు ఈ రాశి వల్లనే ఏర్పడతాయి. ఒక విధముగా మొత్తం మానవ శరీర నిర్మాణము ఈ రాశి వల్లనే జరుగుతుంది. మానవ జాతి యొక్క అధునిక పరాకాష్ట ఇక్కడ జరుగుతుంది. కనుక Christ కన్యకు పుట్టాడంటారు.

శరీరంలో ఇది జీర్ణకోశము, కాలేయము మొ॥ వాటిని సూచిస్తుంది. సరి రాశి, సౌమ్య రాశి. స్త్రీ రాశి, ద్విసభావ రాశి, భూత త్త్వ రాశి అధిపతి-బుధుడు-నీచ-శుక్రుడు

7 పంచ ముద్ర సులక్ష్య దర్శనభావ మాత్ర నిరూపణం
విద్యుదాది ధగ్ధగిత్వ సుచిర్వీనోద వివర్ధనం
చిన్మ ఖాంతర వర్తినం విసద్విలాస మమాయికం
ప్రాత రేవహి మానసాంత ర్భావయే ద్గురుపాదుకం.

ఇది తులరాశి యొక్క శ్లోకము :-

యోగసాధనలో:— "సమత్వల యోగ ఉచ్చతే" "సంతులన" చాలా ప్రముఖ పాత్ర సంతులన తేపటానికి పంచ ముద్రలు ఉపయోగపడతాయి. పంచముద్రలు — షణ్ముఖీ ముద్ర, ఖేచరీముద్ర, మహాముద్ర, అశ్వనీముద్ర శాంభవీ ముద్ర—ఈ సాధనవల్ల శరీరముతో విద్యుత్ ప్రభావం పెరిగి వినోదించగల్గే శక్తి పెరుగుతుంది.

ఇది చిత్త—3,4 పాదాలు. స్వాతి—4 పాదాలు, విశాఖ—1,2,3 పాదాలు కల్గిఉంటుంది. బేసి రాశి, పురుషరాశి, క్రూరరాశి. చరరాశి, వాయు తత్త్వరాశి, అధిపతి—శుక్రుడు ఉచ్ఛ—శని, రవి—నీచ—దేహములో దీని స్థానము నాభి మూత్రపిండములు.

8 పంచవర్ధ సుచిర్విచిత్ర విశద్ధ తత్త్వవిచారణం
చంద్ర సూర్య చిదగ్ని మండల మండితం ఘణ చిన్మయం
చిత్కళా పరిపూర్ణ మంతర చిత్స మాధి నిరీక్షణం
ప్రాత రేవహి మానసాంతర్భావయే ద్గురుపాదుకమ్.

ఇది సూర్య, చంద్ర, అగ్ని తత్త్వాల నుపయోగించుకుని ఛిత్కళలను పరిపూర్ణంగా "అంతర సమాధిలో" నిరీక్షణ చేస్తే పంచ వర్ణాత్మకమైన ఈ విచిత్ర ప్రపంచము తన విశుద్ధ తత్త్వాన్ని అమృతత్త్వ ప్రాప్తి ద్వారా సాధకునకు తెలియచేస్తుంది. ఈస్థితిలోకి సాధకుడు మృత్యువు కలుగజేసే పరిస్థితిలో కూడా దానిని ఎదుర్కొని గెలువగలుగుతారు. శ్రీకృష్ణుడు, పూతని మొ॥ రాక్షసుల బారినుండి రక్షింపబడుట, సద్గురువులు విషజీవాలలో సహజీవనము.

C.V.V. అరవిందోల, అమృతత్త్వ ప్రయోగాలు మొదలగునవి అన్నీ వృశ్చికరాశి ప్రభావాన్ని తెలియ జేస్తాయి. విశాఖ—4వ పాదము, అనూరాధ 4 పాదాలు, జేష్ట 4 పాదాలు, సరిరాశి, సౌమ్యరాశి, స్త్రీరాశి, స్థిరరాశి, జల తత్త్వము. దేహములో స్థానము—మర్మావయవము.

# శ్రీ గుర్వష్టకమ్

1 శరీరం సురూపం॥తంధానాకళత్రం-యశశ్చారుచిత్రం ధనంమేరుతుల్యమ్!
గురోరంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం-తతఃకిం తతఃకిం తతఃకిం తతఃకిమ్!

2 కళత్రం ధనం పుత్రపౌత్రాదిసర్వం-గృహంబాంధవా స్సర్వమేతద్ధిజాతమ్
గురోరంఘ్రి పద్మే మనశ్చేన్న లగ్నం- తతఃకిం తతఃకిం తతఃకిం
తతఃకిమ్!

3 షడంగాది వేదోము ఖేశాస్త్ర విద్యా-కవిత్వాది గద్యం సుపద్యం కరోతి
గురోరం ఘ్రి పద్మే మనశ్చేన్నలగ్నం-తతఃకిం తతకిః తతఃకిం తతఃకిమ్!

4 విదేశేషు మాన్యం స్వదేశేషుధన్యః-సదాచార వృత్తేషు మత్తోనచాన్యః
గురోరంఘ్రి పద్మే మనశ్చేన్నలగ్నం-తతఃకిం తతఃకిం తతఃకిం తతఃకిమ్

5 క్షమా మండతీ, భూ పభూపాలబృందైః - సిదాసేవితం యస్యపాదార-
విందమ్!
గురోరంఘ్రి పద్మే మనశ్చేన్న లగ్నం - తతఃకిం తతఃకిం తతఃకిం
తతఃకిమ్!

6 యశో మే గతం ధక్షుదాన ప్రతాపాత్-జగద్వస్తు సర్వం కరేయత్ప్ర
సాదాత్
గురోరంఘ్రి పద్మే మనశ్చేన్న లగ్నం - తతఃకిం తతఃకిం తతఃకిం
తతఃకిమ్!

7 నభోగే, నయోగేన వా నా జిరాజౌ- నకాంతాముఖే నైన విత్తేషు చిత్తమ్
గురోరంఘ్రి పద్మే మనశ్చేన్నలగ్నం - తతఃకిం తతఃకిం తతకిం
తతఃకిమ్!

8 అరణ్యేన నాస్వస్యగేహే న కార్యే - నదేహే మనో వర్తతే మేత్వనర్ఘ్యే
గురోరంఘ్రి పద్మే మనశ్చేన్న లగ్నం - తతఃకిం తతఃకిం తతఃకిం
తతఃకిమ్!

9 అనర్ఘ్యాణి రత్నాని, భుక్తాని సమ్యర్ - సమాలింగితా కామనీ యామినీషు
గురోరంఘ్రి పద్మే మనశ్చేన్న లగ్నం - తతఃకిత తతఃకిం తతఃకిం

10 గురోరష్టకం యః పఠేత్పుణ్యదేహి - యతిర్భూపతి బ్రహ్మచారీచగేహి
లభేద్వాంచితార్థం పదం బ్రహ్మ సాంజ్ఞం - గురో రుక్త వాక్యే మనో
యస్యలగ్నమ్!

ఈనాడు మనము చిక్కుకుని యున్న సమస్యల వలయం మానవజాతి చరిత్రలో ఇంతకుముందు ఎప్పుడూ కానరాలేదు. వాటికాధారమైన మౌలిక కారణం ఒకటైనప్పటికీ, అన్ని సమస్యలూ విలక్షణమైనవే. వాటిని నివారించడానికి మౌలికమైన ఆలోచన. సాహసాలు కావాలి. పాత ఉదాహరణలు సమాధానాలు ఈ సందర్భంలో వుపయోగపడవు.

ఈనాటి సమస్యలలో అన్నింటి కంటే భయంకరమైనవి ఏవి? అని ఒకదాని తర్వాత ఒకటి విశ్లేషించుకుంటూ పోతే, ఈ క్రమంలో తృతీయ విశ్వ యుద్ధం సంభావన' మొదటి స్థానం అలంకరిస్తుంది. మొదటి రెండు విశ్వ యుద్ధాలప్పటికి తగిన విశేష ఆయుధాలు నిర్మించబడ్డాయి. ఇప్పుడు అణుశక్తి అన్నిటికంటే ముందరవుంది. అణుబాంబుల, ఉదజని బాంబులచర్చ ఇప్పుడు చాలా అధికంగా వుంటోంది.

## మూడవ ప్రపంచ యుద్ధాన్ని ఆపే ప్రయత్నము

వీటికి ధీటైనవి, ఏవిధంగానూ తీసిపోనివి రసాయనిక బాంబులు (Chemical Bombs). అంతేగాక అత్యధిక సంఖ్యలో నిర్మితమై వుండుట వల్ల ఏ క్షణంలో అయినా వీటిని ప్రయోగించే పరిస్థితి ఏర్పడవచ్చు. ఒక్క బాంబుతో న్యూయార్క్, మాస్కో, పారిస్, లండన్ వంటి మహానగరాలు కొన్ని సెకండ్లలో నాశనమయిపోవచ్చు. వీటి ప్రయోగం ఒక నిమిషంపాటు నిరంతరం జరుగుతే ప్రపంచంలో ఏ మహానగరమూ వుండదు. అంతే గాక వీటి వల్ల వ్యాపించే విషవాయువుల వల్ల చిన్న చిన్న గ్రామాలలో కూడా జీవనం ప్రభావితం అవుతుంది. గాలి, నీరు, ఖాద్య పదార్థములు పూర్తిగా కలుషితమై మానవజీవితానికి భయంకరమైన ప్రమాదాన్ని తీసుకవస్తాయి. అప్పటికీ యింకా అణ్వాయుధాల ప్రయోగం ఆగకపోతే, పృథ్వీఖండం, విఖండితమై కుజ,

గౌరవంబు కలవానికి అపకీర్తి మరణంబు కంటె అధికంబు

బృహస్పతి గ్రహాల మధ్య ఇప్పుడు అంతరిక్షంలో ఎగురుతున్న చూర్ణంవలె ఏర్పడుతుంది.

ఆనాటి యుద్ధాలలో ఎదురు ఎదురుగా వున్నవారికే ప్రమాదం ఉండేవి. ఎక్కువగా యుద్ధంలో పాల్గొన్నవారె చనిపోయేవారు. ఇప్పుడు అసీమా బంధం కూడా లేదు. ఈ అణు, రసాయనిక బాంబుల ప్రభావం యుద్ధంతో ఏ మాత్రం సంబంధంలేని వనవాసుల మీద కూడా చాలా ఎక్కువ ఉండ వచ్చు. ఎక్కడ వున్నవారైనా విషాక్త వాయువుల, వికిరణముల వారినుండి సురక్షితంగా ఉండలేరు. ఈ పరిస్థితులలో సమస్త భూమండలము యుద్ధ భూమిగా మారుతుంది. ఇందులో యుద్ధం చేసేవారు, చేయని వారు, బాలురు వృద్ధులు, కదన రంగం నుంచి వందలాది మైళ్ళ దూరంగా వున్నవారు ఎవ కీ రక్షణ లేదు.

ఈ పంక్తులు చదువుతున్న పాఠకుడికి కూడా బాంబులు తయారు చేసే వాడికీ, వాటిని ప్రయోగించే వారికి, ఉన్నంత ప్రమాదముంది. వీటివల్ల మాన వేతర ప్రాణులు, వృక్ష, వనస్పతులు, జలాశయాలలో జీవులు కూడా నాశన మౌతాయి. ఇంత పెద్ద ఎత్తున జరిగే వినాశనానికి "సురక్ష" ఏర్పాట్లు చేయ లేము. "డాలు" ఎప్పుడూ చిన్నదిగానే వుంటుంది. అది శిరస్సులను ఛాతీ మాత్రమే కొంతవరకు రక్షించగలదు. మిగతా అంగాలకు రక్షణ యివ్వలేదు. అదేవిధంగా బాంబుల బారినుండి కొన్నివేలమందిని కందకాలు అవీ నిర్మించి రక్షించగలిగినా దానివల్ల ఏమి లాభం? బయటకు వచ్చినా ఆ విషాక్త వాతా వరణమేకదా! ఉండేది.

ఈనాడుఇదే చాల ప్రముఖ విపత్తి. ఇది ఇప్పుడు ప్రత్యక్షంగాని కం టికి కనిపించక పోయినప్పటికి తక్షణమే తన భయంకర ప్రమాణాలు చూపిం చక పోయినప్పటికి ఈనాడు భవిష్యత్తు సురక్షితంగాలేదు అని నిశ్చయంగా చెప్పవచ్చు. ఒక అర్థ విక్షిప్త స్టోర్ కీపర్ ఈశస్త్ర భండారంలో ఒక మండు తున్న పుడకవేసి ఒక బటన్‌నొక్కి పైన చెప్పిన పరిస్థితులను ఏర్పరచవచ్చు. ఒకరు ఆక్రమణ చేస్తే రెండవ వారు వూర్కొనే కూర్చుని ఉండలేరు కదా! ప్రశ్న ఒక చిన్న ఆక్రమణా, లేక పెద్ద ఆక్రమణా అన్నది కాదు.

---

ఆత్మ సత్యంబు - దేహంబు అసత్యం

---

ఒక చిన్న యుద్ధం సర్వ నాశనం చేయగలదు. శత్రు పక్షంవారే కాక మిత్రపక్షం వారు కూడా సమానంగా నాశనమవుతారు. ఇదివరకు యుద్ధాలలో ఈ బాధ ఉండేది కాదు. అప్పుడు ప్రతిపక్షులమీద ఎలా ఆక్రమణ చేయలో అలోచించుకొనేవారు. కాని ఇప్పుడు ఆ విధంగా ఆలోచించలేము. వాయువు ఒక సంపూర్ణ క్షేత్రం మీద ఉంటుంది. ఆ క్షేత్రంలో మిత్ర సముదాయాలు వున్నప్పటికీ ఈ ప్రభావం తప్పదు. సమస్త విశ్వం యొక్క అన్ని భాగాలకు తన విష ప్రభావాన్ని వ్యాప్తి చేసే ఈ అణుయుద్ధ సంభావన ఈనాటి సమస్యలలో చాలా ప్రముఖమైనది. కొన్నాళ్ళక్రితం వరకు యీ అణ్వాయుధాలు, రష్యా, అమెరికా వద్ద మాత్రమే వుండేవి. ఇప్పుడు ఫ్రాన్స్, బ్రిటన్, చైనా మొదలగు వారివద్ద కూడా వున్నాయి. అందువల్ల ఎప్పుడు, ఎలా! ఎవరు? ఏం చేస్తారు? వూహించలేము. అణ్వాయుధాల విస్తారము వల్ల సమస్య ఇంకా జటిలమైనది.

నివారణోపాయం ఆలోచించే ముందు అసలు ఈ సమస్య ఎలా ఉత్పన్నమైనదో ? ఎలా అభివృద్ధి చెందిందో ? తెలుసుకోవాలి. హిట్లర్ ఓటమితో అణుబాంబు బహిరంగమైనది. అమెరికా దాన్ని వికసింపచేసి జపాన్ మీద వుపయోగించింది. జపాన్ ఆ దెబ్బకు తట్టుకోలేక ఆత్మ సమర్పణ చేసింది. దానిని చూసి ప్రతి గరిష్టదేశం తన ప్రతిపక్షాలను ఇదే విధంగా అణగద్రొక్కవచ్చు అని భావించింది. ఈ పరుగు పందెంలో రష్యా, అమెరికాలు మిగతావారికంటె ముందంజ వేశారు. వీరిరువురి మధ్య ముఖ్య ప్రతి ద్వందితము ఏర్పడి రెండు ముఠాలు ఏర్పడ్డాయి.

కాని పరిస్థితి ఎలా ఏర్పడినది అంటే అటు ముందుకు వెళ్ళలేరు, వెనక్కిరాలేరు. ముందుకు వెళ్ళాలంటే అనేక సమస్యలు. ఇప్పటికి తయారైన అణ్వాయుధాలు తమ విరోధులనే కాక సమస్త ప్రపంచాన్ని సర్వ నాశనం చేయడానికి సరిపోతాయి. అందువల్ల ఇంకా ఎక్కువ అణ్వాయుధాలు తయారుచేసి ఏమి లాభం ? అంతేగాక ఈ పనిలో నిమగ్నమై యున్న వైజ్ఞానికులను, కార్ఖానాలను ఏమి చేయాలి? శత్రువులు ఇంతకంటే పెద్ద ఆయుధాల్ని నిర్మించగలిగితే మళ్ళీ వెనక్కి పడిపోయే ప్రమాదముంది కదా ! తమ

కర్మాచరణంబు నందే అధికారంబు - కర్మఫలంబు లేదు

పతిద్వంది, తమకంటె ముందుకు వెళ్ళిపోవచ్చు అనే భయము వలన వీటి మీద జరుగుచున్న ప్రయోగాలను ఆపేసాహసం ఎవరూచేయలేకపోతున్నారు.

కాని, ఈ ప్రయోగ పరంపర ఇలా జరుగుతూ వుంటే ఇంతవరకు తయారైన ఆయుధాలు ఏమౌతాయి ? దీనిమీద ఖర్చవుతున్న అసాధారణ వ్యయము ఎంత వరకు పెట్టుబడి పెట్టాలి ? అంతేగాక 1, 2, 5, 10 బాంబులు ప్రయోగించడం మాత్రమే జరుగుతుంది. మిగతావాటిని ఎక్కడుంచుకోవాలి. అంతేగాక ఈ కార్ఖానాలలో ఉత్పత్తి అయిన బూడిద ఎంత భయంకరమైన లక్షణాలు కల్గియున్నదో అందరికి తెలుసు. అణ్వాయుధాల నిర్మాణము ఇంకా అలా కొనసాగితే నిర్మించిన వాటికంటే 'బూడిద' యొక్క సమస్య ఇంకా జటిలమౌతుంది.

ఇవంతా చూస్తే 'జపాన్' మీద చేసిన ప్రయోగంలాగే ఎవరో యితరులమీద ప్రయోగించి తక్షణ లాభము పొందగలగాలి. కాని వర్తమాన పరిస్థితులలో ఇది సంభవము కాదు. 'జపాన్' వద్ద అప్పుడు తిరిగి జవాబివ్వడానికి సాధనాలు లేవు. ఇప్పుడు పరిస్థితులు మారిపోయాయి. చైనా, ఇరాన్, ఇజ్రాయల్ లాంటి వైజ్ఞానిక ప్రగతిలో వెనుకబడిన దేశాలు కూడా తిరిగి జవాబివ్వగలిగే స్థితిలో ఉన్నాయి. అంతేకాక ఇంకొకరు సహాయం చేయుటకు ముందుకు రావచ్చు. అందువల్లనే ఈనాడు ఎవరూ ఆక్రమణచేసే సాహసము చేయలేక పోతున్నారు. ఆక్రమణ కంటె ఇప్పుడు రక్షించుకొనడం , ఎలా ? అన్న ప్రశ్న ముఖ్యమైనది. నిర్మాణము ఆపివేస్తే ఎదుటివాడు ఆపుతాడు అనే నమ్మకము లేదు. ఈ గందరగోళ పరిస్థితులలో తలకుమించిన ఖర్చు ఇంకా ఎన్నాళ్ళు కొనసాగించాలి ( దీనికి పెట్టుబడి ఎక్కడనుంచి వస్తుంది ?

ఆత్మరక్షణకు ప్రాముఖ్యమునిచ్చే రణనీతి రాజీ ప్రయత్నాలు ఒప్పుకోదు. పూర్వకాల పరిస్థితి వేరు. అప్పటి శౌర్య పరాక్రమాల గుర్తింపు వేరు. ఈనాడు మీసాలు త్రిప్పి తక్షణమే వాటిని క్రిందకు తిప్పేయడానికి ఎవరూ సంకోచించరు. ఇటువంటి పరిస్థితులలో మొదలుపెట్టడము కష్టమే మొదలు పెట్టాక ఆపడం అంతకంటే కష్టము. ఈ గందరగోళ పరిస్థితుల యొక్క అంతము ఎక్కడ అన్నది అంత సహజముగా తెలుసుకొనలేము.

---

భోగైశ్వర్య ప్రియులకు నిశ్చయ బుద్ధి కలుగదు.

---

ఒకరు ఇంకొకరి రాజ్యమును పొందాలి అనే కోర్కెకూడా ఈనాడు లేదు. ఒకప్పుడు ప్రజాతంత్రము. సామ్యవాదము యొక్క మత్తు చాలా ఎక్కు ఎక్కువగా వుండేది. తమ ఆలోచనా విధానానికి అనుకూలంగా ప్రపంచాన్ని మార్చి వేయాలనుకునే పిచ్చి వుండేది. దానికొరకు ఎంతదూరమైనా వెళ్ళే ఉత్సాహము ఉండేది. ఇప్పుడా వేడి చల్లబడింది, ఇప్పుడు ప్రజాతంత్ర, రాజ తంత్ర సామ్యవాదాల యొక్క కలగాపులగము మాత్రమే వున్నది. అందరి ఆలోచన విధానాలు రాష్ట్రీవాదమనే సంకీర్ణతమీద అవరుద్ధమవుతుంది. ఇతరులందరు వారు నమ్మిన సిద్ధాంతాలమీద నడిచి తీరాలనే దురాగ్రహము లేదు. ఇటువంటి పరిస్థితులలో తమవంటి శాసన పద్ధతి అమలు చేయడానికి బయట దేశాలతో యుద్ధము చేసే బాధ్యత ఎవరూ తీసుకోవడానికి తయారుగా లేరు. శీతయుద్ధము (Cold war) ఏదో ఒక పక్షానికి సహాయము అందించ వేరే విషయము.

ఈనాటి సమస్త పరిస్థితులు ఒక మహా యజ్ఞాన్ని మొదలు పెట్టడము సులభము కాదని, ఒకవేళ మొదలుపెడితే దానిని ఆపటము సాధ్యము కాదని స్పష్టంగా తెలియజేస్తున్నాయి. స్థితిని యథా ప్రకారంగా వుంచటం ఎంత ఖర్చుతో కూడినదీ అంటే ఎక్కువ కాలము దానిని కొనసాగించలేక పోవచ్చు. Tax Pay Yer ఎంతవరకు ఈ బరువును వహించగలడు.

ఈనాడు ఎవరూ యుద్ధము మొదలుపెట్ట దలుచుకోలేదు, కాని ప్రతి పక్షాలమీద వున్న అవిశ్వాసము వలన ఒక నిర్ణయానికి రాలేకపోతున్నారు. ఇపుడు మాటకి కూడా విలువ లేకుండా పోయింది.

ఇది ఈ నాటి స్థితుల విశ్లేషణ. దీనికి సమాధానము ఒక్కటే. కాళ్ళను వెనక్కి తీసుకొని చేతులను కట్టివేసుకోవాలి. ఒక పక్షము ఈబరువు వహించ వలసి వస్తుంది. ఇరు పక్షములు రాజీకి వచ్చాక నిర్ణయాలు అమలు పరు స్తాము అనేది జరగని పని. ఒకవేళ రాజీకి వచ్చినా దానిమీద నిలబడతారని గ్యారంటీ ఏముంది? అందువల్ల యుద్ధములో నష్టపోవుట కంటే శాంతి కొరకు మొదటి అడుగు వేసే ధైర్యము చూపించగలిగే ఆత్మ బలము పెంపొందించాలి. గాంధీజీ ఇది చేసి చూపించారు. బ్రిటీషు వాళ్ళ శక్తి ఎక్కువ. వాళ్ళ

---

బుద్ధి స్థిరంబైన పరమాత్మ సాక్షాత్కారంబగు

---

శత్రువులు సులభంగా బల ప్రయోగము చేసి అణగద్రొక్క గలిగే స్థితిలో వున్నారు. కాని భయపడి పోకుండా ప్రమాదాన్ని ఎదిరించడానికి ఆయన నిర్ణయించుకున్నారు. ఆ పోరాటంలో సమాన స్థాయి లేకపోయినా గెలవగలిగారు. ఆత్మబలము, సత్యము వున్నప్పుడు అనుకూల పరిస్థితులలో గూడా గెలుపు సాధ్యము అని నిరూపించబడింది. ఒకవేళ ఓడినా యుద్ధములో జరిగిన వినాశనము కంటే ఇది మంచిది కదా!

ఈ వివేకము వుత్పన్నము చేయడానికి నేను సూక్ష్మీకరణము ద్వారా ఉపార్జిత శక్తిని వుపయోగిస్తాను. ఇరు పక్షాలను వెనక్కి మళ్ళడానికి ఒత్తిడి తెస్తాను, ఆక్రమణము కంటె వెనక్కు వెళ్ళడమే తెలివైన పని అని వారికి విశ్వాసము కలుగజేస్తాను. ఈఒత్తిడివల్ల ఈనాటి ఆక్రోశాలన్నీ చల్లబడతాయి. ఇంగిత జ్ఞానము వుండి బాధ్యతలు అర్థముచేసుకునే కొత్తపరిస్థితులు మొదలు అవుతాయి. యుద్ధములు, శీత యుద్ధములుగా మారుతాయి. శీత యుద్ధములు చివరకు చాలాకాలము వరకు, యుద్ధ విరామ రూపములో పరిణమిస్తాయి.

(యుగద్రష్ట, తపోనిష్ఠ, వేదమూర్తి పండిత శ్రీరామశర్మ ఆచార్య, సూక్ష్మీకరణ సాధన నుండి)



## గాయత్రి – యజ్ఞోపవీత ఆవశ్యకత

అనేక మంది యజ్ఞోపవీతమును ధరించుట తమకు సాధ్యముగాదని నిర్వహించలేమని తలపోస్తారు. సంయమములను పాటించలేమని భావిస్తారు. ఇది "నా మనస్సులో ఈశ్వర భక్తి లేదు. కావున పూజ చేయను" అని అన్నట్లుగా ఉన్నది. పూజ చేయటం భక్తి కలుగుటకు, భక్తి ఉన్నట్లయితే పూజ చేయటం అవసరం. ఇది యజ్ఞోపవీతపు విషయంలో గూడా వర్తిస్తుంది. ధార్మిక నియమములను పాటించటం తమంతట తామే కలిగినట్లయిన యజ్ఞోప

స్వధర్మంబు ఆచరించకుండిన అపకీర్తి, పాపంబు సంభవించు

వీతము ధరించే ఆవశ్యకత ఎందుకు? నియమములను సమయానుకూలంగా నిర్వహించలేనివారు, యజ్ఞోపవీతము వున్నందున ఆ నియమములను పాటిస్తారు. నియమములు నిర్వహించలేని వారికి జంధ్యము తప్పక అవసరము. దానిని ధరించ వలెను. వ్యాధిగ్రస్తునకే ఔషధము అవసరము. వ్యాధి లేనప్పుడు ఔషధపు ఆవశ్యకత లేదు.

నియమముల నెందుకు అలవాటుగా ఎంచుకొనవలె? దీనిని గురించి ప్రజలకు చిత్రమైన ఆలోచనలున్నాయి. భోజన సమయములందు నియమములకు మాత్రమే జంధ్య మవసరమని పలువురు భావిస్తారు. స్నానము చేయకుండా ప్రయాణము చేసిన ఆహారము (ప్రయాణములో తీసుకెళ్ళినది) రాత్రి మిగిలిన ఆహారము తమ వారుగాక ఇతరులచే వండబడిన ఆహారమును భుజించకుండుట కూడా యజ్ఞోపవీత నియమమని గూడా పెక్కు మంది అభిప్రాయము. ఇది చాలా అసమంజసము. భ్రమతో గూడిన ఆలోచన. యజ్ఞోపవీత ఉద్దేశ్యము మానవ జీవితమునకు సర్వాంగ పూర్ణ ఉన్నతిని కలుగజేయుట, ఈవిశిష్టతలలో సంపూర్ణ ఆరోగ్యం గూడా ఒకటై ఉన్నది. దానికోసం ఇతర నియమములను పాటించడంతో పాటు భోజనానికి సంబంధించిన నియమములను సావధానముగా అవలంభించుట గూడా ఉచితము. ఈ దృష్టితో జంధ్యము ధరించిన వ్యక్తి భోజన సంబంధమైన నియమములను పాటించుట మంచిది. కాని కొందరు ద్విజులు తమ జీవనంలో సర్వాంగీకరమైన ఉన్నత నియమములను పాటించుటలేదు. కాని భుజంపై జంధ్యాన్ని ధరించి మాత్రం ఉంటారు. ఒకవేళ భోజనానికి సంబంధించిన విషయాలలో లోట్లు జరిగినంత మాత్రాన జంధ్యాన్ని ధరించుటకు పొరపాట్ల కారణము వలన అధికారము కోల్పోయామని తలంపరాదు. అసత్యమాడినందు వలన, దురాచార దృష్టి గలిగినందున, నిజాయతీ లేనందున. సోమరియైనందున, వ్యసనగ్రస్తు డైనప్పటికి, జంధాన్ని విమర్శించనవసరము లేనప్పుడు, కేవలము భోజన నియమములో అప్పుడప్పుడూ కొంచెము నియమోల్లంఘన జరుగుతుంది. కావున యీ ఆలోచన సరియైనదని భావించలేము.

---

ఆత్మ ఇంద్రియ అగోచరం

---

మల మూత్రములు విసర్జించునపుడు జంధ్యము చెవులపై నుంచుకొనుట మరచినపుడు భయం కలుగుతుంది. ఈ భయం వలన అనేకులు జంధ్యము ధరించరు. లేక ధరించుట మానివేస్తారు. ఈ అలవాటు కఠోర నియమంగా పాటించవలెననేది నిజం. కాని ప్రథమంలో అలవాటు పడేంతవరకు ఈ తొమ్మిది శిఖలకు కొంత సౌకర్యము కలుగవలెను. అందువలన ఒక్కొక్క రోజు మూడు సార్లు జంధ్యములను మార్చవలసిన అవసరము కలుగుతుంది. అందువలన జంధ్యాన్ని కంఠానికి చుట్టుకొనవలెను. అందువలన అది పైకి వస్తుంది. చెవులకు చుట్టుకొన్నందున (ఒక ముడి) జంధ్యము నడుమనుండి పైకి వెళుతుంది. అందువలన ఒకవేళ చెవులకు కట్టుకోవటం మరచినప్పటికి అశుద్ధ సంగత్యము కలుగదు. కొన్ని రోజులు అలవాటు అయ్యేటప్పటికి కంఠానికి చుట్టుకోవలసిన అగత్యం గూడా ఉండదు.

చిన్న వయస్సు గల బాలుర కోసం, మతిమరుపుగల వ్యక్తులకోసం మూడుపోగుల యజ్ఞోపవీతమును వ్యవస్థీకరింపవచ్చు. మూడుపోగుల పేటలు కావున ఆచార్యులు ఉపవీతమును (జంధ్యమును) "కంఠీ" శబ్దముతో సంబోధిస్తారు. బాలురకు ఉపనయనము జరిగేటప్పుడు వారికి దీక్షతోపాటు "కంఠి" ధరింపజేస్తారు. ఈరోజున గూడా "గురువు" నామాన్ని ధరించే పండితులు మెడకు కంఠి ధరించి చెవిలో మంత్రము చెప్పి గురుదీక్ష నిస్తారు.

మనో పరిపక్వము చెందని వ్యక్తి యజ్ఞోపవీతము నిత్యము శుభ్రపరచడం గురించి పూర్తిగా ధ్యానముంచడం బహుశా మరుచుట కద్దు. కావున శరీరానికున్న మలినం జంధ్యాని కంటుకుంటుంది.. ఫలితంగా దుర్వాసన, మలినం, రోగ క్రిములు అందులో చేరుతాయి. ఆస్థితితో "కంఠి" కంఠమును శరీరాన్ని తక్కువగా స్పృశించేటట్లు ఉపాయములు వెతకవలసి వస్తుంది. దీనిని మొత్తం తులసి పూసలు, రుద్రాక్షలు, లేక ఇతర వస్తువుల గింజలు కంఠీ దారానికి చుట్టబడతాయి. ఫలితంగా రెండూ శరీరాన్ని స్పృశించుతాయి. స్వేదము అంటకుండా, శుద్ధిప్రమాదమునుండి రక్షణ దొరుకుతుంది. అందువలన నే పూసలున్న కంఠమాల ధరించవలె. ఏలనన ఉపవీతము గాయత్రీ యొక్క మూర్తిపంతమైన ప్రతీక. దానిని ధరించకుండ "భగవతి" యొక్క

జన్మించిన వానికి మరణంబు మరణించిన వానికి జన్మంబు తథ్యంబు

సాధనమునకు ధార్మికాధికారము కలుగదు. నేడు క్రొత్తఫాషనులో ఆభరణ ములను ధరించడం తగ్గినది. కాని కంఠానికి మాత్రము కంఠమాలలు ఏ రూపములోనైనా ధరించడం స్త్రీపురుషుల కలవాటున్నది. పేద స్త్రీలు కంచు కంటెలు ధరిస్తారు ఈ భూషణములను హారము, నెక్లెస్, మాల, కంటె మొద లైన పేర్లతో వ్యవహరిస్తారు. కాని వాస్తవంగా ఇవి "కంఠీలు" మాత్రమే స్త్రీల వద్ద ఇతర ఆభూషణములున్నా లేకున్నా పేద స్త్రీలు కూడా ఏదో రూపంలో కంఠమాలను ధరించడం మాత్రం నిశ్చయము. దీని వలన భారత దేశపు స్త్రీలు తమ సహజ దార్మిక ప్రేమను ఏదో ఒక రూపంలో జీవించి ఉండే విధంగా ఉపవీతమును ఏదోరూపంలో ధరిస్తారు.

ఉపవీత ధీరణకు అధికారులుగాని వారు ఏ విధమైన దీక్షను గ్రహిం చనివారు గూడా "మూడు పోగులు" లేక "తొమ్మిది పోగులు" ఉపవీతము లను నాలుగు ముడులువేసి ధరిస్తారు. నా విధంగా చిహ్న పూజ జరుగు తుంది. పూర్తి యజ్ఞోపవీతంలోని పొడవుగానున్న ముడిని (మూడు సూత్రాలు గల దానిని కంఠానికి తగిలించుకోవడం గూడ అక్కడక్కడ రివాజుగునున్నది

(పూజ్య గురుదేవులు శ్రీరామశర్మ "గాయత్రీ మహావిజ్ఞాన్" నుండి)



## పంచీకరణ – సూక్ష్మీకరణ సాధనలు



1 సహస్రారం :- ఓం భూర్భువః స్వః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్!

(చేయి పైకెత్తి మంత్రంచెబుతూ పూర్తయ్యేసరికి మాడును సృజించాలి).

2 అజ్ఞాచక్రం :- ఓం హ్రాం మిత్రాయనమః. (భూధ్యామన్ని సృజించాలి)

3 విశుద్ధి :- ఓక హ్రీం రవయే నమః. (గొంతును సృజించాలి)

---

నువ్వు గెలుస్తావు అంటే గెలుస్తావు. విజయానికి నమ్మకం చాలా ముఖ్యం.

---

4 అనాహతం :- ఓం హ్రూం సూర్యాయనమః. (హృదయాన్ని తాకాలి)

5 మణిపూరకం :- ఓం హ్రైం భానవేనమః. (నాభిని స్పృజించాలి)

6 స్వాధిష్టానం :- ఓం హ్రౌం ఖగాయనమః

7 మూలాధారం :- ఓం హ్రః పూష్ణేనమః

8 మూలాధారం :- ఓం హ్రాం హిరణ్య గర్భాయనమః )

9 స్వాధిష్టానం :- ఓం హ్రీం మరీచయే నమః

10 మణిపూరకం :- ఓం హ్రూం ఆదిత్యాయనమః (నాభి ని స్పృజించాలి)

11 అనాహతం :- ఓం హ్రైం సవిత్రే నమః (హృదయాన్ని తాకాలి)

12 విశుద్ధం :- ఓం హ్రౌం అర్కాయనమః (గొంతును స్పృజించాలి)

13 ఆజ్ఞాచక్రం :- ఓం హ్రః భాస్కరాయనమః (భ్రూమధ్యాన్ని తాకాలి)

## వృక్షములు వాటి ప్రాముఖ్యత

ప్రాచీన కాలము నుంచి మన పూర్వులు వృక్షముల ప్రాముఖ్యతను గుర్తించి, వాటిని చక్కగా ఉపయోగించుకొంటున్నారు. కొన్ని వృక్షాలను పూజించుట మనం ఎరుగుదుము. దానికి కారణం దానిలోని అద్భుత విశేషం. వైజ్ఞానికంగా కూడా నిరూపించబడ్డాయి. కొన్ని వృక్షాల చెంత ఆసీనులైనంత మాత్రానసే జ్ఞాన ప్రాప్తి యగునని తెలియుచున్నది.

అశ్వర్థ వృక్షము :- దీన్ని గమనిస్తే ఇది పూర్తిగా ఔషధ ప్రమాణమైనది. దీనిలోని ప్రతి ఆకు, కాయ, బెరడు అత్యంత శక్తివంతమైన ఓషధులుగా గుర్తించబడినవి. దీని పండ్లను తినిన, పురుషులకు వీర్య వృద్ధియును, వీటిని నీడలో ఎండబెట్టి పొడిచేసి పాలు, పంచదారలతో కలిపి సేవించిన స్త్రీలకు సంతాన ప్రాప్తి అగునని వైద్య శాస్త్రము తెలుపుచున్నది.

ఉత్తరాలు దూరంగా ఉండేవారికి దగ్గరితనం అనుభవింపజేస్తాయి.

2 రావి చెక్కను నీటిలో మరగించి కషాయమును త్రాగిన నోటి పూత నివారించబడును.

3 రావి బెరడు బూడిద చేసి నీటిలో కలుపుకొని త్రాగినచో, అజీర్ణ వ్యాధి నివారణ మగును. పుల్లని త్రేనుపులు తగ్గిపోవును.

4 రావి బెరడు పొడిని కాలిన గాయాల మీద చల్లినచో త్వరగా మానుట యేగాక తెల్లని మచ్చలు ఏర్పడవు.

5 రావి బెరడు కషాయముగా కాచి చల్లార్చి దానితో కురుపులను కడిగిన త్వరగా మానిపోవును.

6 రావి చెట్టులో (అశ్వత్థ) నారాయణుడు నివశించునని గీతా ప్రమాణము (గీ. అ. 13). కనుక దీనికి ప్రదక్షిణము చేయుట వలన సకల శుభ ములు కలుగును.

దీనిని సక్రమముగా ఉపయోగించుకొనిన మానవులకు కావలసినవన్నీ లభ్యమగును.

అత్తి వృక్షము (ఉదుంబరము లేదా మేడి చెట్టు)

ఇది దత్తాత్రేయునికి ప్రీతికరమైనది, దీని మూలమున శ్రీగురుడు నివశి స్తాడని "దత్త చరిత్ర" చెబుతున్నది.

పూర్వం హిరణకశిపుని సంహరించిన నారసింహునికి గోళ్ళు మంటలె త్తినవట, అంతట లక్ష్మిదేవి మేడి ఆకులతోను, పండ్ల రసములతోను ఆయన బాధను నివారించినదట. అందుకాయన ప్రసన్నుడై, అవృక్షానికి తనసాన్నిధ్య వరము నొసంగినాడు. ఆ వృక్ష నీడన జప ధ్యానములు చేసిన విశేష ఫలిత ములు లభించును. ఆవృక్షాన్ని పూజించిన వారికి విషబాధలు తొలగిపోవును ఆ మేడి పండ్లను తినినచో స్త్రీలకు కలుగు అనేక స్త్రీ సంబంధమైన వ్యాధులు తొలగిపోవును. అత్తిపండ్ల చూర్ణము పంచదారతో కలిపి తిన్నవారికి Withe discharge (తెలుపు) పూర్తిగా నివారణ జరుగును. అనాగే పచ్చి అత్తి కాయల కూర కూడా శరీరానికి చలవ చేసి, వేడిని తగ్గించి, ఋతు క్రమాన్ని ఏర్పరచును, ఈవిధంగా దత్తస్వామి లక్ష్మి సమేతుడుగా అందు నివశించును గాన దాన్ని పూజించే వారికి సకల బాధలు తొలగిపోవును.

# యోగక్షేమం వహామ్యహమ్

సృష్టి యొక్క నియంత భగవంతుడే. అత్యంత శ్రద్ధా విశ్వాసములతో సంపూర్ణ సమర్పణ చేసుకున్న సాధకునికి మానావమానములు, సుఖదుఃఖముల వంటి పరిస్థితులన్ని మంగళకరమైనవని అర్థము చేసుకుని సమస్త బరువు బాధ్యతలను ఆయనపై మోపినవారి బాధ్యత ఆయన తన భుజస్కంధములపై తీసుకుంటాడు. ఇదే శరణాగతి అంటే.

భక్తుడు నిష్కపట భావంతో ఈశ్వరుని మీద పూర్తిగా అవలంబిస్తే నపుడు సహాయత తప్పనిసరిగా లభిస్తుంది. అటువంటి సంఘటన సుప్రసిద్ధ పండిట్ గోపీనాథ్ కవిరాజ్ వారి పుస్తకం "సాధు దర్శనము మరియు సత్ప్రసంగ"లో ఇవ్వబడినది. శశిభూషణ్ సన్యాల్ అనే భక్తుడు అత్యంత సరళ స్వభావము, సంయమనము గలవాడు. ఈశ్వరుని మీద అతని అనురాగం అద్భుతము. ఎటువంటి కష్టాలు వచ్చినా ఇతరులకు చెప్పుకొనేవాడు కాదు. అది అవశ్యకము కాదనేవాడు. సర్వాంతర్యామి భగవంతునికి అన్నీ తెలుసు, ఆయన కావాలనుకుంటే పరిస్థితులు అనుకూలముగా మారిపోతాయి. సన్యాల్ గారి కుటుంబములో ముగ్గురే వ్యక్తులు - ఆయన, ఆయన భార్య, కుమారుడు. ఆయనకు ఉద్యోగము చెయ్యటం ఇష్టము లేదు. భక్తుల ద్వారా లభ్యమయ్యేదానితో గృహస్థ జీవనము గడిపేవాడు.

ఆయన మంచి చికిత్సకుడు. ఆయుర్వేదం, అల్లోపతి, హోమియోపతి క్రోమోపతి వంటి అనేక పద్ధతులలో సిద్ధహస్తుడు. ఆయన కావాలనుకుంటే చికిత్స ద్వారా ధనోపార్జన చేసి గృహములో ఎటువంటి లేమికి తావులేకుండా చేసుకోగలడు. కాని ఆయన స్వభావము అటువంటిదిగాదు. ఆయన దగ్గరకు రోగులు, అశ్వస్థులు ఎప్పుడు చాలమంది వస్తుండేవారు. వీరేగాక శాస్త్ర అధ్యయనము కొరకు విద్యార్థులు కూడా వుండేవారు. వీరందరి దగ్గర శుల్కము ఏమి తీసుకోకుండా సేవ చేస్తుండేవారు.

---

విశ్రాంతి అనే తియ్యదనం శ్రమ అనే చేదునుంచి లభిస్తుంది.

---

ఇది జరిగిన రోజులలో ఆయన వరాహనగరం (కలకత్తా)లో ఉండే వారు. ఆయనకు ఒకసారి ఆర్థిక ఇబ్బంది వచ్చింది. ఇంతమందికి వైద్యము చేస్తున్నాను వీరి దగ్గర డబ్బు తీసుకుంటే ఎలా వుంటుందీ అనే ఆలోచన వచ్చింది. కాని ఒక నిర్ణయానికి రాలేకపోయాడు. ఎప్పుడూ సౌమ్య మూర్తిగా వుండే ఆయన ఆరోజు వేరే విధంగా వున్నాడు. ఉన్నట్టుండి గాలిలో ఎగురు కుంటూ ఒక పుస్తకంలో ఒక చినిగిన భాగం ఆయన దగ్గర పడ్డది. అది వైదిక వాఙ్మయములోని ఒక ఖండము. దానిలో బ్రాహ్మణ స్వభావము గల వారు సేవకు ప్రతిఫలముగా ఏమియు స్వీకరించకూడదని వ్రాయబడి వున్నది. వైద్య వృత్తి జీవనోపార్జనకు సాధనము కాదని ఆయన అర్థము చేసుకున్నాడు. మరల మామూలుగా నిశ్చింతగా మారిపోయాడు.

కానీ ఆరోజు కూడా ఏమీ లభ్యం కాలేదు. అడగటం అతని స్వభా వములో లేదు. అయాచిత భావముతో, శ్రద్ధతో ఏది లభ్యం అయిందో దాని తోనే పని గడుపుకునేవాడు. కాని ఆరోజు ఆహారము లేని పరిస్థితి వచ్చింది. బహుశా భగవంతుడే భక్తునికి పరీక్ష పెట్టినట్టున్నాడు. ఆయన సరే మిగిలిన పరివారం వారి సంగతి ఏమిటి ? వాళ్ళు కూడా ఆకలితో ఉండవలసినదేనా? కనుచూపు మేరలో ఆశ కనిపించటంలేదు. ఆరోజు అందరూ బిల్వపత్ర రసాన్ని త్రాగారు. రెండోరోజు అలాగే చేశారు. మూడోరోజు వచ్చింది. మధ్యాహ్నం అయింది. కాని ఏమి లభ్యం కాలేదు. కాని ఆయన చలించ కుండా తన దైనిక కార్యక్రమాలలో నిమగ్నమయ్యాడు. రోగులకు చికిత్స చెయ్యటం, విద్యార్థులకు శిక్షణ కార్యాలలో యథావిధిగా జరుగుతున్నాయి. ఈ మూడు రోజులలో ఆయన కార్యక్రమాలలో కొంచెం కూడా మార్పులేదు. వచ్చినవారికి గత మూడు రోజులుగా ఏమి జరుగుతున్నదో కించిత్ మాత్రం కూడా తెలియలేదు.

అది బ్రహ్మ సూత్ర గ్రంధముపై చర్చా సమయము. ప్రతిరోజు జరిగే ఈ కార్యక్రమానికి అనేకమంది విద్వాంసులు వచ్చేవారు. ఆరోజు శ్రీరామ కృష్ణ పరమహంస అంతరంగిక శిష్యుడు స్వామి అభేదానంద కూడా వచ్చారు అప్పుడు ఆయన కాళీ మహారాజ్ అనే పేరుతో పిలువబడేవారు. చర్చ మొదలయింది. సన్యాల్ మహాశయుడు ఒక్కొక్క సూత్రాన్ని సాధన ద్వారా

అంతరాత్మ అనేది మానవులోని దైవత్వం

లభ్యమైన జ్ఞానము ద్వారా వివరిస్తున్నారు. అందరూ మంత్రముగ్ధులై వింటున్నారు. ఆ సమయములో పోస్టుమాన్ ఒక ఇన్స్యూర్డ్ రిజిష్టర్ లెటర్ తీసుకుని వచ్చాడు, ఎవరో 'మిత్ర' అనే ఆయన సన్యాల్ మహాశయుని పేరుతో పంపాడు. సంతకం పెట్టి తీసుకుని ఆ ఉత్తరం పై నుంచి క్రిందకు మనస్సులోనే చదివారు. ఉత్తరం ప్రక్కన పెట్టి కూర్చున్నారాయన. కళ్ళ నుంచి నీరు రావటం చూశారు. అందరూ స్తబ్ధులయ్యారు. ఎంత పెద్ద కష్టాలు వచ్చినా కన్నీరు కార్చని ఆయన కన్నులనుండి కారుతున్న అశ్రు ధారలు అక్కడ కూర్చున్నవారికి విచిత్రంగా కనిపించింది. 15 నిమిషాలు అలా గడచాయి. అది ఒక అద్భుత దృశ్యము.

చివరకు మౌనము భంగమయింది. అభేదానంద అన్నారు - మహారాజ్ ఏమి జరిగింది? ఏమైనా శోకపూరితమైన సమాచారం వచ్చిందా ? ఎటువంటి కష్టాలయినా ఎదుర్కొనే మీకు ఈ కన్నీరు ఏమిటి ? మా మనస్సుకు అర్థం కావటంలేదు. మా బుద్ధి ఒప్పుకోవటం లేదు. మామీద దయవుంచి ఏమి జరిగిందో వివరించండి.

ఇది విని సన్యాల్ మహాశయుడు గంభీర స్వరముతో ఇలా అన్నారు. "ఇది బాధతో వచ్చిన కన్నీరు కాదు. శోకము నన్ను కదిలించలేదు. నేను భగవంతుని కరుణలో మునిగిపోయాను. కఠోర నియమము పాటిస్తున్నప్పటికి ఆయన కృపను స్మరించుకుంటే ఈ కన్నీటిని ఆపలేకపోయాను. దీనిలో సుఖములేదు. దుఃఖములేదు. ఆ దయానిధి దివ్య అనుగ్రహం వల్ల అంతః కరణలో జరిగిన పరిణితి ఇది" తరువాత ఆ ఉత్తరాన్ని భక్తుల ముందు వుంచి చదవమన్నారు దానిలో ఇలా వున్నది— నిన్న రాత్రి నేను ఒక అద్భుత స్వప్నాన్ని చూసాను. స్వప్నంలో కాశీ విశ్వనాథుడు కనిపించి తనకు చాలా ఆకలిగా వున్నదన్నాడు. చాల రోజుల నుంచి ఉపవాసం చేస్తున్నాను. భక్తుడు ఆకలితో వుంటే నేను ఆహారం ఎలా గ్రహించగలను ? కాశీ విశ్వ నాథుడు ఇంకా ఇలా అన్నాడు— నా భక్తుడు చాల రోజులనుండి ఆహారం లేక నిరాహారంగా వున్నాడు. ఇది నాకు చాల కష్టం కలిగించింది. నీకు నాపైన కొంచమైన భక్తి వుంటే వెంటనే అతనికి భోజన వ్యవస్థ ఏర్పాటు

---

నాకు వ్యతిరేకంగా లేనప్పుడు నాతో ఉన్నట్లే లెక్క

---

చెయ్యి. ఆ స్వప్న ద్రష్టకు సన్యాల్ వారి పూర్తి చిరునామా స్వర్ణాక్షరాలలో వ్రాసి చూపించాడు. తరువాత ఆ సజ్జనునికి నిద్రనుండి మెలకువ వచ్చింది. వెంటనే స్వప్నంలో చూచిన వ్యక్తి పేరు. చిరునామా నోట్ చేసుకున్నాడు. 500 రూపాయలు ఇన్‌స్యూర్డు కవర్‌లో పంపాడు.

సన్యాల్ మహాశయుడు గత మూడు రోజులుగా ఇల్లు ఏ ప్రకారం గడిచిందో తెలిపాడు. మూడు రోజులనుంచి ఆహారం లేకుండా వున్నామని చెప్పేందుకు సంకోచించలేదు. తన జీవనాధారం భగవంతుడేనని వక్కాణించాడు. భగవంతుడి ఈ కరుణను స్మరించుకుంటే కన్నీరు రాక ఏమవుతుంది. ఇది విని అందరు ఆనందంగా భగవంతుని కీర్తించటం మొదలు పెట్టారు. ఆరోజు శాస్త్ర మీమాంస అక్కడే సమాప్తమయింది.

భగవంతుడు ముందుగా భక్తుని సజ్జనత్వాన్ని, నిష్కలుతను చూస్తాడు ఈ పరీక్షలో నెగ్గినవారికి అయాచిత అనుగ్రహం ప్రారంభమవుతుంది. ఈ రోజుల్లో ఎక్కడ చూసినా విశ్వాస ఘాతకులే. ఎవరిని నమ్మాలి ? ఎవరిని నమ్మకూడదు ? కాలంలో మానవీయ ఆలోచన సరళి ఎంత పతనమైనదంటే బహుశా ఇలా ఎప్పుడు దిగజారలేదేమో ? ఇటువంటి పరిస్థితులలో భగవంతుని కరుణ అందరిపై సాధ్యంకాదంటే దీనిలో నింద్య ఏముంది ? మామాలు మనుష్యులే చెత్తా చెదారాన్ని చీదరించుకుంటుంటే భగవంతుని చేతన చెడు వ్యవహారములను పాటించే వారిపై ఎలా అవతరిస్తుంది? ఎలా సహాయం లభిస్తుంది ? మనుషులు మారటమే ఆయనకు కావలసినది. ఇది చేయగలిగితే ఆయన అనుగ్రహం కొరకు ఎక్కడికి పరిగెత్తనవసరము లేదు. ఈశ్వరుని చేతనత్వం సర్వత్ర వెలుగొందుతూనే వున్నది. ఇది కనుక ఏకాంత ఉపాసనలో అనుభవంలోనికి వచ్చినట్లయితే మరుస్థలములో కూడా ఆయనను సాక్షాత్కరింప చేసుకొనవచ్చును. ఆయన దేశకాల బంధనముల కతీతుడు. ఆయనను ఎప్పుడైన ఎక్కడైన పొందటానికి అడ్డు ఏమిలేదు.

సమర్పణ యోగము దీని తరువాత చరణము. ప్రతి పరిస్థితిని భగవంతుని ప్రసాదంగా భావించి స్వీకరించి సంతోషంగా వుండాలి. ఇంకొక మాటలో ఇలా చెప్పవచ్చు. తమ ఇచ్ఛానిచ్ఛలు, రుచి ఆ రుచి మొ॥ వదిలివేసి ఈశ్వరుని ఆకాంక్షలను సర్వోపరి రూపంలో అంగీకరించవలసి వస్తుంది. ఇది చేయగలుగుతే, భగవంతునిపై శ్రద్ధ కలిగివుంటే "యోగక్షేమం వహామ్యహమ్"" భగవత్ వచనము చరితార్థం చేయటానికి ఆలస్యం కాదు.

అఖండ జ్యోతి - జనవరి 97

# మహాశక్తి గాయత్రి

గాయత్రి మంత్ర ఉద్గమనాన్నే దేవ సంస్కృతిగా భావిస్తారు. సృష్టి ఆదిలో విశ్వబ్రహ్మాండ సంరచనా కార్యక్రమము బ్రహ్మదేవునికి అప్పగించి నపుడు ఆయన ఆలోచించాడట—ఇంతటి మహా కార్యాన్ని ఏకాకిగా ఎలా చేయగలను! నాకు అనుభవము ఏమీ లేదే! సాధనా ఉపకరణాలు ఏమీ లేకుండా ఈ కార్యాన్ని ఎలా నిర్వహించగలను?

ఆయన సందేహాన్ని దూరం చేయటానికి తపస్సు చేయమని ఆకాశవాణి ద్వారా వినిపించింది. కాని తపస్సంటే అర్థం ఏమిటో ఆయనకు తెలియలేదు. గాయత్రి సాధన చెయ్యమని రెండోసారి వినిపించింది. ఆయన జిజ్ఞాసకు సమాధానంగా గాయత్రి మంత్రం 24 అక్షరాలు చెప్పబడ్డాయి. 3 వ్యాహృతులతో సహా ఆదేశానుసారము బ్రహ్మదేవుడు గాయత్రి ఉపాసన మొదలు పెట్టాడు. తరువాత సమయానుసారము ఆయనకు జ్ఞాన విజ్ఞాన రూపముగా రెండు ఉపలబ్దులు హస్తగతమయ్యాయి. జ్ఞాన పక్షాన్ని "గాయత్రి" అని. విజ్ఞాన పక్షాన్ని "సావిత్రి" అని చెప్పబడ్డాయి. గాయత్రి చేతనాత్మకమైనది. సావిత్రి ప్రకృతి సంబంధమైనది. ప్రకృతితో పదార్థములు చేయబడ్డాయి. వాటిని గత శీలము చెయ్యటానికి చేతసత్వము ఈ విశ్వ వ్యవస్థలో సమావేశ మయింది.

ప్రాణుల శరీరాలు పంచతత్వాలతో నిర్మించబడ్డాయి. వాటితో చేత సత్వ ప్రాదుర్భావం జరిగింది. జంతువులలో సాధారణ చేతన సరిపోయింది. కాని మనుష్యులలో పంచ ప్రాణాలతో మిళితమైన ఆత్మచేతన నింపబడ్డది. అన్య ప్రాణులు ప్రకృతిలోని పదార్థములను ఉపయోగించుకుంటున్నాయి. కాని మనిషికి ఉచితానుచిత నిర్ణయము కొరకు విశిష్టజ్ఞానం అవసరమయింది. దీని కొరకు నాలుగు ముఖములతో నాలుగు వేదాలను వ్యాఖ్యానం చేశాడు.

---

దేశప్రేమ సత్ప్రవర్తనను, సత్ప్రవర్తన దేశప్రేమను కల్గిస్తుంది.

---

వేదములలో కర్తవ్యము, ఉచితానుచితాల జ్ఞానము ప్రకృతిలోని వస్తువుల ఉపయోగము, ప్రగతి సాధన కొరకు కావలసిన విజ్ఞానము కూడా వున్నాయి. వేదములు దుర్గ్రాహ్యమైనవి. వీటికి వివేచనగా ఉపనిషత్తులు బ్రాహ్మణ గ్రంథములు, సూత్రములు, స్మృతులు, దర్శనములు, ఆవిర్భవించాయి. వీటిని జ్ఞాన, విజ్ఞానముల భాండాగారముగా ఉద్గమ కేంద్రాలుగా చెప్పవచ్చు. భారతీయ జ్ఞాన - విజ్ఞానములన్నీ ఒకే మహా మంత్రము యొక్క విస్తృతరూపము.

ఈ విద్యల వల్లే భారతభూమిని "స్వర్గాదపీ గరీయసి" గా పేర్కొనే సౌభాగ్యం లభించింది. ఈ విభూతుల వలననే ఈ దేవభూమిని చక్రవర్తిగా జగద్గురువుగా స్వర్ణ సంపదల నిలయమయింది. మన పూర్వీకులు జ్ఞాన, విజ్ఞానాల వల్ల స్వయంగా లాభాన్వితులేగాక ప్రపంచంలో ప్రతి క్షేత్రంలో ఎక్కడెక్కడ ఏ అవసరం అయిందో, అవసరమైన అనుదానం చేశారు.

పురాతన కాలంలో మానవ కాయంలో దేవ సంస్కృతి, దేవ సంపదల ఉపలబ్ధి పొందుటకు గాయత్రి మంత్రమే ఏకైక ఆధారము. దీని దక్షిణమార్గ ప్రయోగములో దేవత్వం వికశించింది, వామ మార్గ తంత్ర ఉపచారములలో దైత్య ప్రకృతి సాధనా సంపన్నతలు, చమత్కారాలు పెంచుతున్నది. దితి, అదితి సంతానములే దేవతలు దైత్యులు. దితి గాయత్రి యొక్క, అదితి సావిత్రి యొక్క పేర్లే.

విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు యజ్ఞ సంరక్షణార్థము బల, అతిబల విద్యలు నేర్పాడు. బల అంటే సావిత్రి, అతి బల అంటే గాయత్రి. "బల" వలననే శివధనస్సు విరవబడింది. అతిబల మాధ్యమంలో శక్తి రూపిణి సీత ప్రాప్తించింది. బలసేతు బంధనానికి తోడ్పడితే, అతిబల ప్రతాపంలో రామ రాజ్యం స్థాపించబడింది. ఇదే విధంగా అన్య అవతారాలు కూడా గాయత్రిని అవలంబన చేసుకున్నాయి. దేవతలు, ఋషులు గాయత్రి ఉపాసకులే.

భూః భువః స్వః—మూడు వ్యాహృతులతో బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులయ్యారు. వీటితోనే సరస్వతి, లక్ష్మి, కాళి ప్రాదుర్భావం జరిగింది. దేవ పరివారం అంతా వీరి శాఖోప శాఖలే.

గాయత్రి యొక్క 24 అక్షరాలను 24 అవతారములుగా, 24 దేవతలుగా. 24 ఋషులుగా భావించడం జరిగింది. దత్తాత్రేయుని గురువులు కూడా వీరే.

శరీరములో 24 ప్రముఖ శక్తి కేంద్రములు మస్తిష్కములో ఉన్నట్లు భావిస్తారు. గాయత్రి ఉపాసనలో 24 అక్షరాల ఉచ్చారణ వల్ల ప్రసుప్తిలో వున్న ఈ కేంద్రములు జాగృతమయి, వాటి చమత్కారాలు చూపుతున్నాయి. వీటినే రిద్ధి సిద్ధులుగా పేర్కొంటారు.

స్థూల శరీరము, సూక్ష్మ శరీరము, కారణ శరీరము ఆత్మపై అవతరించి యున్న మూడు ఆవరణములు, వీటినే మూడు వ్యాహృతులుగా అర్థము చేసుకొనవచ్చు. జ్ఞాన యోగం. కర్మయోగము, భక్తి యోగములలో వీటి వివేచనే వున్నది. ఉత్పాదనం, అభివర్ధనం, పరివర్తనం ఈ మూడింటివి అనవచ్చు. ఆకాశము, పాతాళము, భూభాగము ఈ మూడే.

గాయత్రిని కల్పవృక్షమని, అమృతమని, పరసువేదని వర్ణించబడింది. కల్పవృక్ష ఛాయలో కూర్చున్నవారి కోరికలన్నీ తీరతాయి. అమృతము త్రాగి అమరులవచ్చు. పరసువేది స్పర్శతో ఇనుము వంటి ధాతువులు బహుమూల్యమైన స్వర్ణముగా మారతాయి. ఇవి అలంకారిక వర్ణనలు కల్పవృక్షమని ఎందుకన్నారంటే అనవసరపు కోరికలు దూరమయి, అవసరమైన కోరికలు మనిషి తన భుజబలం చేత, బుద్ధి బలం చేత సహజముగా తీర్చుకుంటాడు. భౌతిక శరీరానికి అమరత్వం సాధ్యం కాదు. అవతారములే తనువులు చాలించాయి. పుట్టిన వారు గిట్టక మానరు. కాని కొందరు అమరులే. వారు చేసిన అద్భుత కార్యముల వల్ల. ఋషులు అమరులే. మహా మానవులు అమరులే. మనుష్యుల హృదయాల్లో జీవించేవున్నారు. పరసువేది గురించికూడా ఇలాగే చెప్పవచ్చు. సాధారణమైన, హేయమైన పరిస్థితులలో జన్మించినప్పటికి జ్ఞానం వల్ల ఉచ్చ శిఖరం అధిరోహిస్తాడు. కాయ కల్ప వంటి స్థితి ప్రాప్తించుకున్నట్లయితే ఆ తత్వ జ్ఞానాన్ని పరసువేది అంటే ఏ మాత్రం అతిశయోక్తి లేదు.

గాయత్రి ప్రతిమకు నవ యవ్వన నారీ రూపం ఇవ్వబడింది. అంతేగాక తల్లిగా భావించబడింది. దీని తాత్పర్యం ఏమంటే నారి యొక్క శ్రేష్టతను గొప్పదనాన్ని స్వీకరించాలి. ఎక్కడ స్త్రీలు గౌరవించబడతారో అక్కడ దేవతలు నివశిస్తారని మనకు చెప్పారు. అర్జునుడు, శివాజి, నారీ జాతిపై ప్రదర్శించిన మాతృభావమే అందరికి ఆదర్శం కావాలి. పవిత్ర ఉచ్ఛస్థరీయ సమాజ స్థాపన కొరకు ఇదే ఆధారమనవచ్చు.

అనేక మంది అనేక వస్తువులకు మహత్వం అపాదిస్తారు. కాని మహాత్ములు సద్బుద్ధికే సర్వోపరిభూమిక నిచ్చారు. అ సద్బుద్ధిదాయిని గాయత్రికి ప్రథమ స్థానాన్ని ఇచ్చారు.

గాయత్రి యొక్క మూడు చరణములలో ఏకత, సమత, మమతల, మూడు సూత్రాలు సమావేశమయి వున్నాయి. ప్రపంచంలో ఒకే దేశము, ఒకే భాష, ఒకే ప్రభుత్వము రాబోతున్నాయి. ప్రజలందరి భౌతికమైన సుఖసాధనములను, భౌతికమైన అధికారాలను ఒక సమానస్థితికి తీసుకురావలసి వున్నది అది సామాజికమైనది కావచ్చు, ఆర్థికమైనది కావచ్చు. మూడవది మమత. మమత అంటే ఉదారత, ఆత్మీయత. దీనికి అంతర్గతంగా "వసుధైక కుటుంబకం" "ఆత్మవత్ సర్వభూతేషు" మాన్యత వస్తుంది. దీనిలోనే సజ్జనత్వము, సద్‌భావనల ఉత్కృష్టత కూడా వున్నాయి.

ఆలోచనలలో ఉత్కృష్టత, చరిత్రలో ఆదర్శవాదం. వ్యవహారములో న్యాయము- ఈ మూడింటిని సాధకుడు పెంపొందించుకోవాలని గాయత్రి యొక్క నిర్దేశము.

సత్యము. ప్రేమ, న్యాయం గాయత్రి యొక్క మూడు చరణములుగా భావించబడ్డాయి. గాయత్రి మన భూతకాలాన్ని అద్భుతంగా వుంచింది. భవిష్యత్తును కూడా సమున్నతంగా చేస్తుంది. ఇప్పటి అవశ్యకత ఏమంటే వర్తమాన కాలంలో దీని మహత్వాన్ని అర్థం చేసుకోండి. ఇతరులకు అర్థం అయేట్లు చేయటానికి ప్రయత్నించండి.

## కొంచం మీావైపు కూడా చూడండి

దోషములను వెతకటం, దుర్గుణాలను పెరికివేయటం మంచి పనే. కాని ఈ పని మీతోనే మొదలుపెట్టండి. మన చెడు అలవాట్లు మనకు బాగా తెలుస్తాయి. ఇతరుల లోపాలు తెలుసుకోవటం కొంచెం కష్టమైన పని. ఇతరులలో బయటకు కనిపించే లోపాలు గుర్తించవచ్చు. ప్రతివాడి జీవనంలో దాగుడుమూతలుంటాయి. అంతరంగం లోని లోపాలు గుర్తించటం చాలా కష్టమైన

పని. మన లోపాలు గుర్తించ గలిగితే మంచి వైపు దృష్టి సారించగలము. ఇతరుల దోషాలు గుర్తించినప్పటికీ అతను మనమాట వింటాడని ఏమి నమ్మకం లేదు. అందువల్ల మంచి మార్పు కొరకు చేసే ప్రయత్నం మనతోనే ప్రారంభించాలి.

ఇది చాలా సాహసవంతమైన కార్యక్రమము. ఇతరులు మన తప్పులు ఎన్నినపుడు అవి నిజమైనప్పటికి మన అహంకారం వాటిని ఒప్పుకోనివ్వదు. కాని మనలను మనమే స్వయముగా విశ్లేషణచేసినపుడు దోషాలు దుర్బలత్వాలు మానసిక తలములో స్పష్టంగా గోచరించినపుడు అహంకారమంతా అణిగిపోతుంది. సత్యాన్ని స్వీకరించి దుర్గుణాలను వదిలించుకొనే ప్రయత్నం, చేసిన పాపాల నిష్కృతి ఎవరికి వారే చేసుకోవాలి. ఇతరుల ఏమి చేయగలరు ? ఎవరయితే తమ కురూపతను స్వీకరించటానికి భయపడరో. దానిని వదిలించుకొనే ధైర్యం వున్నదో వారు నిజంగా గొప్ప శూర వీరులే.

కొందరు బయటికి ఎంత గంభీరముగా కనిపించినప్పటికి, వారంత పిరికిపందలు ఇంకొకరు వుండరు. అందువల్ల వారి దోషాలను, దుర్గుణాలను దాచిపెట్టటానికి మనోబలం ఉపయోగిస్తుంటారు. కాని దీనిలో సగంశక్తి వాటి నివారణకు ఉపయోగిస్తే మనస్సు నిర్మలం అవుతుంది. తద్వారా పాపాలకు ముక్తి లభించినపుడు అనేక గుప్తశక్తుల జాగరణ ప్రారంభమవుతుంది. మహాపురుషుల జీవనంపై దృష్టి సారించితే వారు ఎలా తమ చెడు అలవాట్లను గమనించారో, వాటిని నివారించారో తెలుస్తుంది. మనము కూడా గొప్పదనం అపాదించుకోవాలంటే మహా మానవులు ఏ బాట మీద నడచారో మనము కూడా అబాట మీదే నడవాలి. ఇతరులను తుచ్ఛులుగా భావించి వారితప్పులు పట్టటం వల్ల ఏమి ప్రయోజనం నెరవేరుతుంది? మన మానవత్వాన్నే పోగొట్టుకుంటున్నామేమో?

ఈ పనిలో మనకు ఎవరు సహాయ పడతారో, మన దోషాలను చూచి మనలను మంచి మార్గంలో నడవటానికి తోడ్పడేవారే మన నిజమైన మిత్రులు. సామాన్యంగా తప్పులు పట్టేవారిని శత్రువులుగా భావించడం జరుగుతుంది. దొంగతనం చేసే వారిని దొంగంటే కోపం వస్తుంది. మోసం చేసే వాడిని మోసగాడంటే కోపం వస్తుంది. అలా అన్నవారిని తన్నటానికి, చంపటానికి

కూడా పెద్దపెడుతుంటారు. ఇది వారి పిరికితనంకాక మరేమిటి? అద్దంలో మన కురూపత్వం కనిపిస్తే భరించలేక అద్దాన్ని పగలగొడ్తానంటే ఏమి లాభం? ఎంత మంది ఇలా తప్పులు చెయ్యటంలేదు, నన్ను మాత్రమే తప్పుపడ్తారేంటి అని ప్రశ్నిస్తుంటారు.

ఏ దుర్గుణాలు మన వ్యక్తిత్వాన్ని వికసించకుండా అడ్డుపడుతుందో మనకు తెలియదు. ఏదుర్గుణం మనలోని ప్రతిభకు అంకుర స్థితిలో అవరోధం కల్పిస్తుందో తెలియదు. అందువల్ల మన దోషదుర్గుణాలను గుర్తించి తీసి వేయాలి.

మన దోషాలను సమీక్షించే కార్యక్రమము ఈరోజే, ఇప్పుడే మొదలు పెట్టాలి. అందువల్ల మన వ్యక్తిత్వ వికాసానికి అడ్డువచ్చే అవరోధాలు తీసివే యగలిగి, ఇతరుల నుండి నింద పడకుండ వుండగలుగుతాము. దీనికి మొట్ట మొదట మన తప్పులు అంగీకరించటం చాలా అవసరము. ఈ పని ఇతరుల ముందు జరుగవలసిన అవసరములేదు. కాని ఆత్మీయ గురుజనుల సమక్షంలో భగవంతుని సాక్షిగా తప్పులు ఒప్పుకోవటానికి సిగ్గుపడవలసిన అవసరము ఏమీ లేదు. అలా చేయగలిగినపుడు గురుజనుల ఆశీర్వచనము భగవంతుని అనుగ్రహము మనలో అపూర్వ సాహసం వికసింప చేస్తుంది. దుర్బలత్వాన్ని పెకలించి విసిరేందుకు చాల సాహసం కావాలి. ఎవరి చెడు అలవాట్లతో వారే యుద్ధంచేసి వారిని వారే పరిశుద్ధము గావించుకొనుట వారి వీరత్వానికి చిహ్నమే.

నిర్మల నిష్పాప హృదయములో ఈశ్వరుని విభూతులు పుష్పించి పల్ల విస్తాయి. అలాంటి వ్యక్తి మాత్రమే తన నిష్కలుష భావనలవల్ల పరమాత్మతో ఏకీకారము పొందగలడు. మనముకూడా మన లోపాలను సవరించుకుని, మన శక్తి సామర్థ్యాలను గుర్తించి, వికసింపచేసుకోవటానికి ఇదే రాజమార్గము.

# దత్తాత్రేయ షట్చక్ర స్తోత్రం

1. మూలాధారే వారిజ పత్రే స (సు) చతష్కే
వం, శం, షం, సం, పర్ణవిశాలైః సువిశాలై
రక్త వర్ణం శ్రీగణనాథం భగవంతం
దత్తాత్రేయం గురు మూర్తిం ప్రణతోస్మి॥

2. స్వాధిష్ఠానే షడ్దళ పత్రే తను లింగే
బాలాందావత్ వర్ణ విశాలై: సువిశాలై:
పీతం వర్ణం వాక్పతి రూపం ద్రుహిణాంతం
దత్తాత్రేయం శ్రీ గురు మూర్తిం ప్రణతోస్మి॥
4. నాభి పత్రే పద్మదశాంతే డఫవర్ణే
లక్ష్మి కాంతం గరుడా రూఢం నరహీరం
నీల వర్ణం నిర్గుణరూపం నిగమాఖ్యం
దత్తాత్రేయం శ్రీ గురుమూర్తి ప్రణతోస్మి॥
4. హృత్ పద్మాంతే ద్వాదశ పత్రే కఠ వర్ణే
శంభుం శేషం హంస విశేషం శమ యంతం
సర్గస్థిత్వం తం కుర్వంతం శివకాంతిం
దత్తాత్రేయం శ్రీ గురు మూర్తిం ప్రణతోస్మి॥
5. చక్రస్థానే చక్ర విశుద్ధే కుసుమాంతే
చంద్రాకారే షోడశ పత్రే స్వర వర్ణే
మాయా ధాశం జీవ శివం తం నిజమూర్తిం
దత్తాత్రేయం శ్రీ గురు మూర్తిం ప్రణతోస్మి॥
6. అజ్ఞా చక్రే భృకుటి స్థానే ద్విదశాంతే
హం క్షం బీజం జ్ఞాన నిధిం తం గురు మూర్తిం
విద్యు ధ్వర్ణం జ్ఞాన మయం తం చటాలాక్షం
దత్తాత్రేయం శ్రీ గురు మూర్తిం ప్రణతోస్మి
7. మూర్ధ్ని స్థానేం వారిజ పత్రే శశి బోజే
శుభం వర్ణం పద్మ సహస్రం సువిశాలం
హం బీజాఖ్యం వర్ణ సహస్రం తరీ యాంతం
దత్తాత్రేయం శ్రీ గురు మూర్తిం ప్రణతోస్మి॥
8. శాంతాకారం శేషశయానం సరవంద్యం
కాంతానాధం కోమల గాత్రం కమలాక్షం
చింతా రత్నం చిద్ఘన పూర్ణం ద్విజరాజం
దత్తాత్రే శ్రీ గురు మూర్తిం ప్రణతోస్మం॥
9. బ్రహ్మానందం బ్రహ్మముకుందమ్ భగవంతం
సత్య జ్ఞానం సత్య మనంతం భవరూపం
పూర్ణ బ్రహ్మానందమ యంతం గురు మూర్తిం
దత్తాత్రేయం శ్రీ గురు మూర్తిం ప్రణతోస్మి॥

10. ఆధారే లింగ నాభే హృదయ సరసి జౌ తాలుబాలె
ద్వి పత్రే షోడశారె ద్విదశ దశె లలాటె
ద్వాదశార్ధే శతుష్కే
నా సాంతె బాల మద్యే డఫ కర సహితె
కంఠ దేశే స్వరాణాం హంక్షం తత్వార్థ
యుక్తం సకల దళగతం వర్ణరూపం నమామి
11. మూలాధార శమర్థశారుణ రుచి ర్వాసాంత వర్ణాత్మకం
స్వాధిష్ఠాన మనేక విద్రుమ విభం బాలాంత షట్పత్రకం
రత్నా భం మణిపూరకం దశదళం డాద్యం ఫకారాంతకం
పత్రై ర్ధ్వా దశభిః అనాహత పురం హె మంకధారంతకం.
12. మాత్రా షోడశ క్తై ద్విశద్ధ మమలం జ్యతిర్మయం వ్యాపకం
హంక్షం హ్యక్షర యుగ్మ పత్ర సహితం తస్మాచ్ఛ అజ్ఞాపురం
తస్మా దూర్ధ్వ మనో ముఖం వికశితం పత్రం సహస్రారకం
నిర్వానరిదమయం సదా శివమయం హంసం సదా భావయే॥
దేహో దేవాల ప్రోక్తో జీవో ద్వే సనాతనః
త్యజీ దజ్ఞాన నిర్మాల్యం సోహం భావేన పూజయేత్॥

## దత్తాత్రేయ కవచము

దత్తాత్రేయః శిరః పాతు సహస్రాబ్జ సంస్థితః
ఫాలం పాత్వనసూయేయః చంద్ర మండల మధ్యగః
కూర్చం మనోమయః పాతు హంక్షం ద్విదళ మధ్యభూః
జ్యోతిరూపోక్షిణీ పాతు శబ్దం శబ్దాత్మకఃశ్రుతా
నాసికాం పాతు గంధాత్మా ముఖం పాతు రసాత్మకః
జిహ్వాం వేదికరః పాతు దంతోష్టే పాతు ధార్మికః
కపోలా వత్రి భూః పాతు పాత్వశేషం సదాత్మభూః
సర్వాత్మా షోడశరాబ్జ స్థితశ్చా త్మావతాద్గళం
స్కంధౌ చంద్రానుజః పాతుః భుజే పాతు వక్షస్థలం హరిః
కాది ఠాంత ద్వాదశార పద్మగో మరుదాత్మకః
యోగీశ్వరేశ్వరః పాతు హృదయం హృదయేశ్వరః
పార్శ్వేదూరః పార్శ్వ వర్తీపాతు పార్శ్వ స్థిర్మమ
హఠ యోగాది యోగజ్ఞః కుక్షిం పాతుకృపానిధిః
డకారాది ఫకారాంతః దశార సరశీరు హేశ

నాభిస్థలే వర్తమానో నాభిం పత్వా త్మకోవతాత్
బకారాదిల కారాంతం షట్ దలాం బుజ బోధకః
జలే తత్వమయో యోగీ రక్షతాం మణిపూరకమ్
సిద్ధాసన సమాసేన ఊరు సిద్ధేశ్వరోవతాత్
వాది సాంత చతుష్పత్రీ సరోరుహ నిబోధకః
మూలాధారం మహిరూపో రక్షతాత్ వీర్యనిగ్రహః
అర్షవ ద్వితియం పాతు జన్వ్యన్యస్త కరాబుజః
జంఘే పాత్వవధూతేంద్రః పాత్వంఘ్రి తీర్థ పావనః
సర్వాంగం పాతు సర్వాత్మా పాతురో మణికేశవః
చర్మం చర్మాం బరః పాతు రక్తం భక్త ప్రియావతాత్
మాంసం, మాంసకరః పాతు మజ్జాం సారాత్మకోవతాత్
అస్థీనీ స్థిరధీః పాయాత్ మేధో వేదా; ప్రపాలయేత్
శుక్లం సుఖకర: పాయాల్ సందేంచ, సుధృడాకృతిః
మనో బుద్ధి రహం కారం హృషీకేశాత్మ కోవతాత్
కర్మేంద్రియాణి పాత్యశః పాతు జ్ఞానేంద్రియాణ్యజః
బంధూన్, బంధు,తమః పాతుశతృభ్య; పాతుశ్రతుజిత్
గృహరామ ధనక్షేత్ర పుత్రదీన్ శంకరోవతాత్
భార్యాం ప్రకృతిజిత్ పాతు పశ్వాదీన్, పాతుశార్గభృత్
ప్రాణాన్ పాతు ప్రధాన జ్ఞో, భూమ్యాదీన్, భాస్కరోవతు
సుఖం చంద్రాత్మక; పాతు దుఖాత్పాతు పురాంతకః
ప్రాచ్యాం విషహరః పాతు పాత్వాగ్నేయాం మఖాత్మకః
యామ్యాం ధర్మాతక; పాతునైరుత్యాం పాతువైరిజిత్
వారాహపాతు వారుణ్యాం వాయువ్యాం ప్రాణదోవతాత్
కౌవేర్యాం ధనకృల్ పాతు పాత్వైశాన్యాం మహాగురుః
ఊర్ధ్వం పాతు మహా సిద్ధః పాత్వధస్తాజ్జటాధరః
రక్షా హీనం తుమేస్థానం రక్షత్వాదీ మునేశ్వరః
దత్తాత్రేయో వజ్రవర్మ పంజరేణాభి, రక్షతు
ఏత్మనే వజ్ర కవచం యః పఠేచ్చృణు యాదపి
వజ్రకాయశ్చిరం జీవి దత్తాత్రేయో భవేద్ధృవం
త్యాగీ భోగే మహాయోగీ సుఖదు:ఖ వివర్జితః
సర్వతః సిద్ధ సంకల్పి జాదస్మృర్తో భవేత్యమః

అఖిల బ్రహ్మాండమున కాదికారణమైన
శ్రీ గురుని చరణములె మాకు శరణము సతము
మూడు మూర్తులలోన తేజమ్ము తానైయై
ముగురమ్మలకు తానె మాతయ్యై వెల్గొందు
శివశక్తి రూపమై శివతరంబైనట్టి ॥శ్రీ గురుని చరణ॥

1) నిజతత్వ దర్శిత్వ సచ్చిదానందమ్ము
ప్రజ్ఞాన ఘనమైన బ్రహ్మ స్వరూపమ్ము
తత్త్వమసి యఁజంచు 'తను' 'నేను' ను దెల్పి
అయమాత్మ పరబ్రహ్మ అనుభవమ్మొసగేటి ॥శ్రీ గురుని॥

2) అహంకారమున మార్పి సాధన రహస్యమున
అందించి మా జన్మ తరింపజేసీ
జగతి మూలము క్షేత్ర క్షేత్రజ్ఞులని దెల్పి
నీవే బ్రహ్మంబనెడు నిండైన ఎఱుక నిడు ॥శ్రీ గురుని॥

3) శక్తి సద్బుద్ధి సద్భావనలు వర్షించు
సవిత నిజతత్త్వము త్రిముఖి గాయత్రిగ
అధ్యాత్మిక యొక్క విజ్ఞాన శాస్త్రముగ
లోకముల నందించు 'త్రిలోక వంద్యుడౌ ॥శ్రీ గురుని॥

4) సద్బుద్ధి గాయత్రి సకల షోడశ నిచ్చి
భువనములకెల్ల అనుగ్రహామృతమిచ్చి
పుడమి తల్లిని పునీత సీతగజేయు ॥శ్రీ గురుని॥

5) సకల సమర్థ సద్గురుల వాణితో
జగద్గురు పాదుకా పీఠ సంరచనతో
శ్రీ గురుని నిజతత్త్వ నిత్యబోధనతోడ
జన్మ జన్మల మమ్ము తరియింప తపియించు
శ్రీ రామశర్మ గురు హృదయాకాశ కృష్ణా !! ॥శ్రీ గురుని॥



సాధనామయ జీవితాన్ని నడుపుతున్న సాధకులారా........
కాకువాయిలోని సకల సమర్థ సద్గురువాణి విశ్వ విద్యాలయమందు

మే 11 శంకర జయంతి నుండి మే 22 బుద్ధ పూర్ణిమ వరకు సాధనా శిబిరము జరగవచ్చునని **R.K.** గారు సూచిస్తున్నారు. 'ధరణీదీక్షా' సమయంలో 'పవిత్ర ధరణి' ఏర్పడాలంటే వ్యక్తి వ్యక్తి పవిత్రుడవాలి. ఆ పథంలో నడవాలనే కోరిక గల ప్రతి వ్యక్తీ ఈ సాధనా శిబిరమునకు వచ్చుటకు అర్హుడే. కనుక ఈ సదవకాశాన్ని వినియోగించుకొని దేవమానవులు సాధనతో మారేందుకు కృషి చేయవలసినదిగా ప్రార్థించుచున్నాము. వివరాలకు ఎడిటర్‌గారికి వ్రాయండి.

ఆధునిక ఋషుల జన్మతేదీల గతనెలలో అచ్చు అయిన వానిలో చాలా తప్పులు దొర్లాయి. వానిని వచ్చేనెల పత్రికలో సరిగ్గా ప్రకటించగలము

PRINTED BOOK-POCKET

TO ............................................................

............................................................

............................................................

PIN

Printed & Puplished by S.S.S Siddi Anugrah Peetham, Kamepalli, Editor : I. Vijaya Bhaskar Reddy, Cross Roads. Santhamagulur (PO. & Mondal) Prakasam (Dt.) Pin 523 302